# మానస సంచరరే...



టి. శ్రీరంగస్వామి

విశ్వసాహితి
వరంగల్లు విభాగం
1988

*MANASA SANCHARARE....*

(Free Verse Poetry)

**T. SRI RANGA SWAMY**

*Price 3/-*

January 1988

For Copies :

1) T. Sri Ranga Swamy
   H. No. 5-11-~~114/4~~ 481, Vidyranyapuri,
   Warangal-506 009

2) Andhra Saraswatha Parishath,
   Boggulakunta, Hydarabad.

Printed by

Mayuri Printing Press
Hanamkonda 506 011.

— టి. ఉదయవర్లు 9-11-1987
ఆంధ్రజ్యోతి, హైదరాబాదు.

# ఆ త్మీ య మ్

"పుస్తకం, వనితా, విత్తం పరహస్తం గతం గతః" అని మనవాళ్ళు అంటారు. మన దేశంలో పుస్తకాలు, పత్రికలు కొనుక్కొని చదివే వారికంటే అరువుతెచ్చి వాటిని చదివే ప్రబుద్ధులసంఖ్య దాదాపు మూడురెట్లు హెచ్చు. పఠనాసక్తి పెరిగినంతగా మన వారిలో పుస్తకాలు కొనుగోలు చేయాలనే అభిరుచి, సంస్కారం పెరగలేదు. ఈ సందర్భంలో ఆత్మీయుడు శ్రీ టి. శ్రీరంగస్వామి తనకు కావలసిన పుస్తకాలను కొనుగోలుచేసి స్వంత గ్రంథాలయం ఏర్పరచుకుని విజ్ఞానం పెంచుకోవడం విశేషం.

మా శ్రీరంగస్వామిలోని పట్టుదల కూడా నన్ను ఎంతగానో ఆకర్షిస్తుంది. ఏదైనా చేయాలనుకుంటే, దానిలోని మంచి చెడ్డల, లాభనష్టాల బేరీజు వేసుకోవడం కన్నా దాన్ని సాధించడానికే ఆయన ప్రాధాన్యత ఇస్తాడు. ఈ శ్రేణిలో ఆయన ఇటీవల వెలువరించిన కొన్ని పుస్తకాలను పేర్కొనవచ్చు వరంగల్లు సాహితీ లోకంలో ఆయన సాధించిన కృషిని పరిగణనకు తీసుకొనవచ్చును.

ఇక పోతే సామెతను యధాతదంగా ప్రయోగించడం మర్యాద కాదనుకుంటే "పిట్ట కొంచెం పట్టు ఘనం" అని శ్రీ శ్రీరంగస్వామి మూర్తిని, శక్తిని వర్ణించవచ్చు.

బమ్మెర పోతన పుట్టుకతోనే కాకుండా, ఇంకా అనేకమంది కవి, పండితులకు జన్మస్థలమైన తెలంగాణా మాగాణంలోని "వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచికను" రూపొందించడంలో శ్రీ శ్రీరంగస్వామి చూపిన ఆసక్తి అభినందనీయమైనది. మా అందరికీ గర్వకారణమైంది. కూడా.

మా శ్రీ శ్రీరంగస్వామి నుండి వెలువడుతున్న ఈ కవితా సంపుటి మానససంచరరే.... నే కాకుండా మరిన్ని గ్రంధాలను కూడా అతని కలం ప్రసాదించాలని ఆశిస్తున్నాను.



T. SRI RANGA SWAMY

Born on 16th July 1950 at Parlapally dist. Kareemnagar
Settled at H. No. 5-11-114/4, Vidyaranyapuri, Warangal 506 009.

Doing Ph. D., at Kakatiya University, Warangal with topic 'VISHWANATHA VARI KRISHNA KAVYALU'

Printed Books :

Madhura (Freeverse poetry) 1984

Shikharam (Freeverse poetry) 1986

Vipanchi (Essayas) 1986

Warangal Zilla Rachayitala Vangmaya Suchika 1987

Manasa sancharare...... (Freeverse poetry) 1988

Edited Books :

Chitanya (Collection of Freeverse poetry) 1980

N.B. Rao Kavitha Darpanam (Essays) 1985

Prabhava (Collection of freeverse poetry) 1987

Swaramalika (Collection of freeverse poetry) 1987

Un-Printed books :

Warangal Nataka ranga Charitra

Madhur Shikhar (Hindi Kavitayee translated by Dr. Ch, Ramulu)

Katragadda Kavitha Samalochanam (Essays)

.........Essays etc.,

Relations with :

Srilekha Sahithi, Sahithi Samithi, Samskruthi Samakhya, Vishwa Sahithi, etc.,

హార్ధికంగా, ఆర్థికంగా సహాకరిస్తున్న చిరకాల మిత్రుడు శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావుకు, బంధుత్వంకంటే మిత్రుత్వంను చూపించే శ్రీ ఉదయవల్లుకు, మిత్రులు శ్రీ డి. క్రిష్ణారెడ్డికి కృతజ్ఞతలు.

ఈ కవితా సంపుటిని ప్రచురిస్తున్న విశ్వ సాహితి వరంగల్లు విభాగం వారికి; ఇందులోని కవితలు కొన్నింటిని ప్రసారం చేసిన ఆకాశవాణి, హైదాబాదు వారికి, ప్రచురించిన పత్రికాధిపతులకూ, నా వ్యాసంగంలో సహకరిస్తున్న మిత్రులందరకూ—కృతజ్ఞతలు.

— టి. శ్రీరంగస్వామి

# మేకవన్నె పులులు

వైట్‌హార్స్ ప్రియారిటీలా
స్వాతంత్ర్యం మన హక్కంటూ
నాదాలూ, నినాదాలూ పేల్చి
కామధేనువు పై
మేఘచ్ఛాయలను పరచినట్టు
ఉచ్చైశ్రవాన్ని తక్షకుడు కౌగలించుకొన్నట్టు
నవనవ్యంగా విషముష్టి ఫలాలను అందిస్తూ
పాకురు పట్టిన మెదళ్ళలో
గుట్టపు డెక్కలు మొలచినట్టు
అభినవ ఘజనీల రక్త నాళాల్లో
ఉప్పొంగిన చైతన్య రథాలకు
దళారీల భటాగ్రజు పొగడ్తలు
సాహిత్య వేషదారుల అబందర నాదాలు
అలలై కెరటాలై కళ్ళాలిడిచిన గుఱ్ఱాల్లా పరుగులెత్తిస్తున్నారు
కులగజ్జి పరదాల వెనుక
స్వార్ధపువయారాలు వన్నెలు పోతున్నాయి.
క్షుద్రుల మోహావేశపు కామనలో
సహృదయ తరంగాలు వెలవెల పోతున్నాయి.
మేఘచ్ఛాయలను వదలిద్దాం
తక్షకులను అంతమొందిద్దాం
ఎండమావుల తరిగిద్దాం
సమభావనా లహరుల
పరిమళాల కొరకు
మేకవన్నె పులులను తరిమేదాం

# నైమిష

ఎంతో కాలంకాలేదు
నీ పుట్టిన రోజును ఘనంగా జరుపుకొని
నీపై ఎన్నో ఆశలు పెనవేసుకొని
నీ కీర్తిని ఘనంగా
నిత్య చైతన్య స్రవంతిని
అందిస్తావని
ప్రతి ఊళ్ళో సభలు జరుపుకొని పొగిడాం
అంతరాంతరాల్లో నిజం
అంకుశం అయి హెచ్చరిస్తున్నా
తేజస్సును వేనోళ్ళ పొగిడాం
నిన్ను పొగిడిన కంఠాలను మెచ్చుకున్నాం
అయినా....
నీ చరిత్ర ఏమున్నది ?
చర్విత చరణంగా రుజువుచేసుకున్నది
శిరోముండనం చేయించిన ఖాకీదుస్తుల ఘనత
వరకట్నం బలిచేసిన ఆర్తుల ఆర్తనాదాలు
నీ ప్రత్యేకత ఏమీ లేదంటున్నాయి
నిత్యం పత్రికల్లో
ఓ ప్రభవా !
అంతశ్చైతన్యం రానంత వరకూ
ఇతరుల ఎడ సానుభూతి ప్రదర్శించనంత వరకు
మానవుడిలో వికాసం కలగనంత వరకూ
ఎన్ని కాలచట్రాలు మారినా
కాల చరిత్ర మారదు
"ప్రభవ" ప్రభవించదు.

# 'మరో మానిషాదమ్'

రోడ్డు మీద నడుస్తున్నాను తప్ప
అంతరంగంలో ఎన్నో కదలికలు
మనసులో ఎన్నో భావనా లహరులు
సుడులు తిరిగిన ఊహల సొబగులు
అంతర్మధనంలో ఊపిరిలు పోసుకుంటున్నాయి
మౌనిలా........స్వరచిత్రమునకు రంగులు అద్దుకుంటూ
భావగీతికల ధ్వనులు గళంలో సుళ్ళు తిరుగుతుండగా
ఆలోచనల వంతెనల పై పయనిస్తున్నాను
యాంత్రికంగా అడ్డం వస్తున్న వాటిని
యాదృచ్ఛికంగా తప్పుకుంటూ
మరో మానిషాదమ్‌నకు నాందిని పలుకుతున్నాను.



# అభ్యుదయం

జనారణ్యాల్లో
చలివేంద్రాలు
భావుకుని మనస్సుల్లో
సహృదయ కేదారనందన వనాలు
సుసంపన్నతకు
సతత హరిత విప్లవంవకు
నిత్యం పోరాటం
అమలిన శృంగారంలా!?
అభ్యుదయం.



# అవధానము

ఏ సందు తిరిగినా
ఏ కొళాయి దగ్గర వంగినా
ఏ హోటల్లో తొంగినా
ఎక్స్‌ప్లాగ్లాస్ పానీ నహీం!
ప్రాజెక్టులన్నీ
ఆలోచనలన్నీ
బీడులై, ఎడారులై
ప్రగతికి చిహ్నాలై
ప్రగల్భాలకు సాక్షులై
అబందరాలై
అసమర్ధతకు తార్కాణాలై
"పానీకే వాస్తే నడుం కట్టండివి"
అవధానం చేస్తున్నాయి.



8

## ఐ.యస్.ఐ.

నా దేశంలో

ఉత్పన్నమయ్యే ప్రతి వస్తువు

మేలిమికి గుర్తు ఐ.యస్.ఐ.

అంతేకాదు ........

నా దేశంలో

ప్రతి వరుడి హోదాకు

వరకట్నం దబ్బులే (ISI) ఐ.యస్.ఐ.



# వ్యక్తావ్యక్తాలు

కీర్తి కిరీటంలో
కలికితురాయిలం కావాలని
తపన ....తపన
ఆకాంక్ష.... ఆకాంక్ష
అంతరంగంలో (ని)
విషాగ్నుల రొదలకు,
స్వార్థపు సెలయేరులకు
బురఖాలు వేసి
ముఖంలో, పెదవుల్లో
దరహాసాలు జల్లిస్తూ
కవితోక్తులు చిందిస్తూ
నవ్యకాముకులై
బహురూపులై
నపుంసకులై సంచరిస్తున్నారు.



# జీవనగీతం

స్వచ్ఛత వెనుకున్న ధవళ కాంతులు
ఆర్ద్రత వెన్నంటిన ఆత్మీయత
సౌరభాన్నంటుకున్న స్నేహపరిమళం
అనుక్షణం వెన్నంటి ఉంటాయి
నిర్మలమైన సాహిత్యోన్ముఖుడి అంతరంగం
నిప్పులా, కడిగిన ముత్యంలా వెన్నాడుతూనే ఉంటుంది
కవి తనువు విహంగంలా ఎగిరిపోయినా
కవి సంధించిన భావుకత
మన హృదయాలలో చిరకాలం పల్లవిస్తుంది

• • •

# ధ్యేయం

నా నివాసం

వృశ్చిక, మిన్నాగులవిషకీలల ధ్వనుల మధ్య

అంతరంగాలలో పేరుకున్న

సుషుప్తి లోంచి తట్టి

అజ్ఞానపు చీకట్లను చీల్చి

సమ్యక్ అవగాహనకు

సచేతనత్వానమునకు దారి చూపిస్తూ

కపాలాల్లో నిద్రిస్తున్న మేధస్సును

స్పృశిస్తూ....

సమతాగానం ఆలకింపిచేస్తూ

ఝుంఝూ మారుతంలా

అజ్ఞానపు నిధులను పెకిలించాలన్నదే

నా నిరంతర ధ్యేయం



# స్నేహం

స్వార్థపు మత్తులో
కుహనా సంస్కారపు సొబగులో
విశ్రాంతిని తీసుకుంటున్న
నా సహచరులను చూస్తుంటే
ఆత్మీయతా సరస్సుల్లో
స్నానింపించి, మధురతను ఎదల్లో నింపి
నిస్వార్థ గానాన్ని
అంతరంగంలో ప్రతిష్ఠింపచేసి
స్నేహం విలువ చెప్పాలని ఉంది
స్నేహం నీడనిచ్చే చెట్టు లాంటిదని తట్టి చెప్పాలని ఉంది



# కలల అలలు

బ్రతుకు దారి
అబందర అయి
గతుకుల రోడ్డుపై
గమనాన్ని సాగిస్తుంటే....
గలగలా 'గోదారి'
గమ్యం తెలియని సందర్భంలో
గప్ చిప్‌గా కలలకు అందకుండా తన్నేసింది



## భూప్రపంచంలోనికి...

నన్ను స్వప్నంలో వీక్షించక పోతే
నన్ను కవిత్వంలో విశ్లేషించక పోతే
శీతవాతాతపాలకు మిమ్ములను గురిచేస్తాను
నీ కలయికే
ఒక వినూత్న సృష్టి
నువ్వేదో వైవిధ్యం చేకూరుస్తావని
మేము ఆశతో వస్తాం
ఏదో ఒక సమ్మోహన శక్తి
నన్నెటో లాక్కు వెళ్ళుతుంది
జీవితం ఒక మిథ్యా స్వరూపం
నువ్వు ఒక వైవిధ్యాన్ని చేకూరుస్తావని
మేము ఆశతోనే నిష్క్రమిస్తాం.

Original – Ajasa Zaharovich English Tatjana Vidovick

# కవితా కాహళి

గతించిన సంవత్సరాల జ్ఞాపకాలలో
ఆర్తినై, భావస్ఫూర్తితో
ప్రతి రోజూ నమ్మకంతో
విభిన్న క్షణాలను సమ్మిళితం చేసుకుంటూ
దశాబ్దాలుగా శిలాక్షరాలను దాటుకుంటూ
నా కవితను సాగిస్తాను
లేదా !
ఈ ప్రపంచమునుండి సుదూరముగా నిష్క్రమించ
దలచుకున్నాను నేను
సముద్రపు గర్భంలో దాక్కోవాలనుకున్నాను నేను
గీతికా స్వనం స్వరంగా నిలువాలని నా ఆకాంక్ష

Original - Ajasa Zaharovich English Tarjana Vidovick

## నిరీక్షణ

నా ప్రేమను అందించటానికి
నిర్విరామముగా
అవిశ్రాంతంగా నిరీక్షిస్తున్న నా కనులవోలె
విరబోసుకున్న శిరోజాల్లాంటి
నా కవితలో చిక్కుకొని
విశ్రాంతి తీసుకుంటున్నాడు
సూర్యుడు !

Original – Ajasa Zaharovich English Milica Kajovick

# అనుభూతి చేవ్రాలు

వెన్నెల కాంతుల్లో
"డ్రైనా" వంతెనపై నిలబడి చూస్తే
వివర్ణమైన స్ఫటిక తరంగాలు
ఆలపిస్తున్నట్టుగా
బహుదూరంగా ఉండి సంభ్రమాశ్చర్యాలు
కలిగిస్తున్నాయి క్షణం క్షణం ....

Original - Ajasa Zaharovich English Ivon Soljan

## డాంబికుడు

వాడు.... .... ....
సర్వ జనామోదకుడు
వానికి తెలుసు
లెంకలు వేయడం
సాహిత్యంలో హితం తెలియదు
'శా'కు 'షా'కు భేదం తెలియదు
అయినా.... ....
వాడు ఇక్కడ సర్వజనామోదకుడు
వానికి తెలియని ప్రక్రియ లేదను
అంతేకాదు.... ....
తనకు సంబంధం లేని విషయంలో కూడా
తనకు ప్రవేశం ఉందంటూ కల్పించుకొని
అభాసుపాలైనా, ఎదుటి వారికి ఔచిత్యం లేదంటాడు
కించపరచడానికి ఏమాత్రం వెనుకాడడు
అసమర్థుడు పీఠమెక్కినా
అందలా లెక్కించే ప్రజల మధ్య వాడు
ఉపాగతుడు
మన ముందు మెచ్చుకొనును
ఇతరుల ముందు హేళన చేయును
అయినావాడు ఉపాగతుడు
లోమానుపాతంలో
విలోమానుపాతమును ధ్యేయంగా అవలంబించినవాడు
చిరస్మరణంగా ఉందే
డాంబికుడు వాడు

# విరాళి

నిత్యజీవితంలోని ఒడిదుడుకుల్లో
గంతులేస్తున్నాను.
సారస్వత సేవలో అడుగులేస్తున్నాను.
ప్రతిక్షణం గందరగోళం
అడుగడుగున విఘ్నాలే
నా నిజ జీవితారణ్యంలో....
ఏడాదికొక్కసారి
ఆదుకొమ్మని వినదిస్తూ
విఘ్నేశ్వరా నిన్ను ప్రార్థిస్తున్నాం.
నీ సేవలో నిస్వార్థంగా పయనిద్దామంటే
నిర్ద్వంద్వంగా నిలువునా నీరై పోతున్నాను
నాకు నిను కొలుచుటకు
నిర్వ్యాపారంగా శక్తి నివ్వ



# శ్రీశ్రీ ప్రహేళికలు

ఆధునిక కవితా తత్వమునకు
"మరో ప్రపంచాన్ని" అందించి
శ్రీశ్రీ "ప్రహేళికల" లో
కొట్టు మిట్టాడుతున్న
నవ్యాధికులను చూస్తూ....
నవ్వుకుంటూ
మహాప్రస్థానం చేసిన
శ్రీరంగం శ్రీనివాసరావూ!
నీకు జోహర్లు.



# భగవంతుడు

అతని కొరకు వెదకు
నీవు ఎవరినైతే పోగొట్టుకొన్నావో....
నీ నుండి ఎంతో దూరం లేదు
అంతరాంతరాల్లోనే నిద్రిస్తున్నాడు.

Hindi Original-Mamata Brajbal

## తెలుసుకో...

మానవుని జీవితం
దారం కంటె పలుచనైనది
మనస్సు పతంగంవలె
సయ్యాటలాడుతున్నది.
దారం వదిలిన పతంగం–
జీవితం క్షణభంగురం–
మట్టిని ముద్దాడు
మరుక్షణం

**Hindi Original-Mamata Brajbal**

# రేపు

కలియుగం రానున్నదను
రేపటిమాట వదిలిపెట్టు
రేపు చేయాలనుకున్నది
నేడే చేయి
అప్పుడే మలుపు సాధ్యమవుతుంది.



Hindi Original-Mamata Brajbal

# భూపాలరాగం

ఆలనాటి గణేశ్ ఉత్సవాలకు
లోకమాన్య తిలక్ స్పందనం
స్వరాజ్య నికేతన ధ్యేయం
అది నిస్వార్థసేవా నిరతి
ఊరికొక్కడు వినాయకుడు నాడు
వాడ వాడకొక్కడు వినాయకుడు నేడు
రకరకాల విఘ్నాలతో
రమ్యంగా, హృద్యంగా
విఘ్నేశ్వర మూర్తులను
రసానుభూతిని పొందుతూ
రంగుల పొందికతో ప్రదర్శిస్తున్నాం
నవరాత్రిలు ఘనంగా
నలుగురితో పోటీపడుతూ
నగరంలో హంసవాహనాన్ని
రావణులను, మూషికాలను,
మహిషాసురులను తలదన్నేటట్టుగా చూపిస్తున్నాం
కైలాసాన్ని మనముందుంచుతున్నారు
మోక్షాన్ని మనకు ప్రసాదిస్తున్నారు
కాని....
మనసుల్లోని........
మలినాన్ని మాత్రంతొలిసివేయలేకున్నాం
విఘ్నరాజా నమోః నమః

# ఒక కవిత

గేట్ వే ఆఫ్ ఇండియాలో
నిలబడి చూస్తే
రంగులీనుతున్న మబ్బులు
ఆకాశంలోని వింతలు
మనలను ఉత్తేజపరుస్తాయి
"నిశి" తన ఛాయలను మెల్లగా
ఆక్రమించుకోవడంతోనే
స్మగ్లర్లకు, పత్తేదారులకు
గేట్‌వే ఆఫ్ ఇండియాలోని
చీకటి ద్వారాలు మెల్ల మెల్లగా
తెరచుకుంటాయి.



English Original–Jayasree Deshai

# భద్రత

నేనొక సామాన్యుణ్ణి,
అస్తమిస్తున్న సూర్యుడిని చూసినప్పుడల్లా
నాకు కనిపిస్తుంది
నా దుర్భర జీవనస్థితి
అనాలోచనల—అధిక ఖర్చుల సమ్మిళితంలో
అతులాకుతలం అవుతున్న జీవన సూచికలో
కనిపిస్తున్న వ్యయపట్టికను
చూస్తున్నప్పుడల్లా
ఉదయిస్తున్న సూర్యుడిలా
నాకు "పొదుపు" గుర్తుకువస్తానే ఉంది.
నా జీవన పథంలో
ఆశారేఖలా పొడిచింది
నా భవిష్యత్తుకు
భద్రతగా నిలిచింది.



# వృద్ధి

సూర్యోదయం....

జీవన గమనానికి ఆరంభం

పొదుపు ఉద్యమం....

భవిష్యత్ భద్రతకు నిదర్శనం.



## మౌన గీతం

గత కొన్నినెలలుగా
ముసుగు వేయబడి, గాలిరాకుండా
కాళ్ళకు బంధం వేయబడి, బందీనై
అవిశ్రాంతంగా ఎదురుచూస్తున్నాను.
కులమత రహిత తత్వరాజ్యాంగంలో
కులము కంపులో మునిగి
నాకులేని నమ్మకాన్ని నాపైరుద్ది
స్వప్రయోజనాలకు వాడుకుంటూ
ప్రజోపకారం నిమిత్తం ఆలోచించిన నన్ను
ప్రజలకు ఆటంకం కలిగించేవిధంగా
"చౌరాస్తా" లో దిష్టిబొమ్మలా పాతేసారు
పౌరులందరిని, దేశప్రగతిని
నా పుట్టినరోజున నాదైనాచూసుకుందామని సంతోషిస్తూ
ఇప్పటికైనా నా ముసుగును, బంధాలను
శృంఖలాలను తెంపుకోవచ్చని సంతోషించాను.
కాని.... ....
స్వలాభాలకు, స్వప్రయోజనాలకు
రాజకీయావసరాలకు, లోబడిన ప్రాణులకు
జయంతులూ, వర్థంతులూ ఒక లెక్కనా....
ముసుగు తీసిన నా రూపం ఎలా ఉంటుందో....
స్వార్థప్రయోజకుల బందీలో
జీవం పోసుకున్న విగ్రహంగా
రోదిస్తున్నాను మౌనంగా....

MANASA SANCHARARE...By

(Free Verse Poetry) T. SRI RANGA SWAMMY

---





వరంగల్లులో [illegible] ఒక ప్రత్యేకతను సంతరించుకొని, [illegible]యంకృషితో పైకి[illegible] వారిలో శ్రీ శ్రీరంగస్వామిగారు చెప్పుకోదగినవారు.

ఇటీవలవెలువడిన "వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక" వీరి కృషికి తార్కాణం. వరంగల్లు సాహిత్య రంగంలో వీరికి ఒక ప్రత్యేకత ఉంది.

—వి శ్వ సా హి తి

వరంగల్లు విభాగం

---

A Publication of Vishwa Sahithi, Warangal wing in the Year 1988 Price Rs. 3-00